# అమృతాభిషేకము



దాశరథి

# అమృతాభిషేకము



( ఖండ కావ్యం )

దాశరథి



క్వాలిటీ పబ్లిషర్సు
విజయవాడ-2

I

# అంకితము

## ఆప్తులు

## డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారికి

శాంతినికేతన ప్రసవసౌరభముల్ తెలుగింటిలోన వి
శ్రాంతముగా చరించునటు సల్పి త్రిలింగము వంగమేకసూ
త్రాంతర సన్నిబద్ధమగునట్టులొనర్చిన నీకు నేను క
ల్పింతును హస్తినా నవపురీంద్రమునందమృతాభిషేకమున్

ఉరుదు ముషాయిరాలనిన నువ్విళులూరుదుమీవు నేను, సం
బరపడివిందు మాంధ్రకవిమాన్యులసత్కవితానులాపముల్
పరువిడి వంగసత్కవితపై అనురాగము వెల్లడింతు మి
ట్లిరువిరి రాగబంధమున కెన్నో సమానగుణమ్ములొప్పెడిన్

సకలాంధ్రమొక్కకై తెనుంగు జనులిచ్ఛావృత్తిజీవించుకో
రిక తెల్గాణమునందు మా ఎదలలో రేకెత్త సేబాసటం
చౌక హార్షాంకితమైనపల్కున శరజ్జ్యోత్స్నల్ ప్రసారించినా
వకళంకకళంకంబగు నీమనశ్శశధర వ్యాకోచి కొండాడెదన్

నా 'మహాంధ్రోదయమ్ము' నానాడు నీవు
భాగ్యనగరి నావిష్కార పరచినావు
ఘూకములు తెల్గు రేకల రాక జూచి
కుందగా వెల్గినట్టి రాకేందు వీవు

పసినాడే బ్రతుకెల్ల మాతృచరణోపాంతంబునందుంచి సం
తసమొప్పారగ జాతిసేవకయి వంతల్ సైచి కారాగ్రహా
గ్రసనమ్మున్ భరియించినట్టి నిను కేంద్రంబందునన్ జూచు మా
ఖుసికిన్ లెక్కలులేవు చెప్పుటకు శ్రీ గోపాలరెడ్డ్యగ్రణీ!

బహుభాషాకవులొక్కచోటసభసల్పన్ నీవునధ్యక్షతన్
వహియింపన్ కడునేర్పుతో సుకవితావ్యాసంగమున్ గూర్చు నీ
మహనీయ ప్రతిభావిశేషములు సమ్రాట్ కృష్ణరాయాది ధూ
ర్వహులన్ జ్ఞప్తికిదెచ్చుచున్నయవి శుంభత్ కావ్యగోపాలకా!

కలగన్న విశాలాంధ్రము
కడు వేచిన సాహితీ అకాడమి నిజమై
వెలసినవి నీవ అధ్య
క్షుడుగా సాహిత్య సంస్థ శోభిలుచుండెన్

మంత్రివిగా అనేకవిధ మంత్రణముల్ గొనిగూడ, సాహితీ
మంత్రజపమ్ము నూన, వసమాన తపస్వివినీవు, నీకు దు
స్తంత్రములేవి లేవు కవితా యువతీ నవతాప్రసన్న వా
క్తంత్రముదప్ప-నీ హృదయధామము వెల్గునుసార్వభౌమమై

మన చిరతరమైత్రీ బం
ధనమున నమృతాభిషేచనమ్మొనరింతున్
గొనుమిదె కవితాంజలి, మన
అనురాగము లినుమడించుచున్నల్లుగ, రెడ్డీ!

---

# అనుక్రమణి



---

# ప్రకాశిక



సాంప్రదాయ సిద్ధంగా వస్తున్న కవిత్వానికి అలవాటు పడిన ఎక్కువమంది పాఠకులకు శ్రీ దాశరథి ఒక కల్పవృక్షంలాంటి వారు. ఆయన కలంనుండి వెలువడే ప్రతివాక్యం సాంప్రదాయ బద్ధమై పాఠకులకు నూతనోత్తేజాన్ని కలుగచేస్తుంది. అంతేకాదు శ్రీ దాశరథి జన్మతః కవి. చిన్న వయస్సులోనే 'నా తెలంగాణ కోటి రతనాల వీణ' అని తన మాతృభూమిని కీర్తించారు. అచిరకాలంలోనే ఆంధ్రదేశంలో ప్రతిభావంతులైన కవియై అశేష ప్రజల ఆదరాభిమానాలు చూరగొన కలిగారు. నేటి కవులలో శ్రీ దాశరథి ప్రతిభావంతులు.

పాతకొత్తల మేలు కలయికకు శ్రీ దాశరథి ఒక ఉదాహరణ.

మురళీ కృష్ణ.

# "సుప్రభాతము"

ఉదయాద్రి బుజమెక్కి ఒకడు నవ్వెను చూడు
భూ దివమ్ములు వెల్గుపూలు పూయ,
ఉవిద తామరబుగ్గ నెవడో ముద్దిడె చూడు
మనసులో వలపు చందనము రాయ,
చిమ్మచీకటి కాల జిమ్మె నెవ్వడో చూడు
గుండెలోపలి తమోగుణము మాయ,
కనురెప్ప దుప్పటీ కప్పులాగె నెవండో
వెలుగు లోకాలు తల్పులను తీయ
వేయిచేతుల ధరణిని పిలచి పిలచి
కౌగిలించె నెవండో శృంగారి చూడు,
కానబడరాని దవ్య లోకాలు చూపి
తాను కనుమూయు లోకబాంధవుడు వాడు.

వీడటో నిద్రాణ పృథివి కన్నులమీది
చీకటి బరువు పోజిమ్మువాడు,
ఈతడేనా తమోభూతమ్ము సిగలోన
మందారమాలిక మలచువాడు,
ఈతడే నటవె జీమూతమ్ములను పెంచి
జగతిపై ముత్యాలు చల్లువాడు,
ఈతడేనా జగద్ధితముకై గగనాన
కాలికి బలపమ్ము కట్టితిరుగు
ఈతడీతడె కావచ్చు నింద్ర దిశకు
పశ్చిమాశకు నడుమ రే బవలు నడచి
ఒకరి వృత్తాంత మొక్కరి కొసగి యొసగి
స్నిగ్ధ బంధమ్ము కూర్చెడి స్నేహితుండు.

ఇతడు లేకున్నచో ఏది పద్మాంగనా
ఫాలాన గోరోచనా లవమ్ము?
ఇతడు రాకున్నచో ఏది భూభామినీ
గల్లభాగాన బంగారు వన్నె ?
ఇతడు లేకున్నచో ఏది దిక్కామినీ
తనువుపై పట్టుపీతాంబరంబు ?

ఇతడు పోకున్నచో ఏది నీలాకాశ
కచపాశమున చంద్రఖండశోభ ?

ఈతడే కాదె మన హృదయేప్సితమ్ము,
ఇతడు లేకున్న జగమెల్ల ఇరులె సుమ్ము,
సుప్రభాతమ్ము, లెమ్ము! తమఃప్రభావ
మంతరించెను రమ్ము, నిశాంతమునకు

దైహికారోగ్యమునెగాక తన కరాల
హృదయమందలి రుజ నెల్ల వదలగొట్టి
ఆత్మకానందమును కూర్చునట్టి వైద్యు
డతని కభివాదమొనరింతు నంజలింతు

పైపై ప్రాకి నభోమహోభవన శుంభద్గోపురాగ్రానకున్
దాపై ఆపయి క్రింది క్రిందులయి తా నంభోధి నంతర్హితుం
డై పూర్వాశకు నశ్వముల్ నడిపి ఘోరాంధ్యమ్ముమాయించువా
డాపద్బాంధవుడేగుదెంచెనదె లెమ్మా! సుప్రభాతమ్మునన్

చంద్రనిప్పుల పెనుకోల సాచియెత్తి
గిరగిరన్ ద్రిప్పినట్లు రాతిరియు బవలు
దశదిశాభిత్తి భాగాలు తాకితాకి
తరలి వచ్చెడు చండ మార్తాండుగనుము

చేతనమ్ములకెల్ల సంప్రీతిగూర్చి
బీజములనుండి మొక్కలు వెలికి తీసి
తీవెలందున పుష్పాలుప్రోవుబోసి
జగతికి విలాసమునుగూర్చె సౌరమూర్తి

కులుకుం దామరకన్నె నెన్నొసటిపై గోరాడు గోరోచనా
తిలకం బెంతటికాంతి చిమ్మెడినొ దిగ్దేశమ్ములన్ రత్న రా
శులు భాసించెను కోటి దీపములు సంశోభించుచుండాన; క
న్గొలకుల్ కాంతిలలెమ్మ భాస్కరుని చక్షుఃపక్షపాతమ్మునన్

ఎన్నడో ఇల్లెక్కి ఎల్గెత్తి కూసెను
కొమరయ్య బంగారు కోడిపుంజు
ఎప్పుడో ఆకాశమెక్కి జండాలెత్తి
వెడలిపోయెను పెద్దవేగుచుక్క

ఎంత కాలంబాయెనేమొ చందురుడేగి,

పడమటింటను చేరి బవ్వళించి

ఎంత సేపాయెనో ఇరుల నీలాంబరం

బుతికి మాలిన్యమ్ము నూడ్చివేసి

ఇంక నిద్దురపోయెదవేమె, సుదతి!

ఇరులె కురులయి పడి మొగమెత్త నీక

బరువుగా నిన్ను నిద్రతో బాధపెట్టు,

తొలగ ద్రోచితి లెమ్మి మత్తు, విడిరమ్ము.



# "అమృతపాతము"

మరల మాయింటి మల్లియమాటునుండి
చందమామ కన్పించె, మిళిందబృంద
మావహించిన చెంగల్వ అంబుజాక
రాంబువులనుండి తలయెత్తినట్లు-నేడు.

అతడు తొంగి చూచినపుడెల్ల అమృత పా
తమ్ము జరుగు, యౌవనమ్ము పెరుగు
కలతలెల్ల తరుగు, కవితాసరస్వతీ
మృదుపదాలు నాల్కమీద తిరుగు.

అతడు నా చిన్ననాడు దయాపయోధి,
నేడు కఠినునివోలె కన్పించినాడు,
నాడు నావెంట అనుకొన్నాడువాడు,
నేడు మిన్నెక్కి కూర్చుండినాడు-రాడు.

భీతిలేనివాడు, ఖ్యాతికోరనివాడు
ఆకసమ్మునుండి దూకెమున్న
తనువు తనువదెల్ల వ్రణములై పోయెను
మానలేదు నేటికైనగాని

బాధలోనకూడ, పలుకడు ఉలుకడు
మరలదూకుమాట మరచిపోడు,
వాని తెగువజూడ భయమౌను, ప్రియమౌను
ప్రాణభీతిలేని ప్రాణివాడు.

వాడు నన్ను విడచి పరువెత్తుననుమాట
కలలలోన గూడ తలపలేము
దూర తీరమందు తారాసతీమణి
పిలిచినంత పరుగువెట్టినాడు.

నన్ను విడచిపోయె మన్నువిడచిపోయె
మన్నులోని అసలు తన్ను విడచె
తారచూపు వలని తనువెల్ల కాంతింప
మన్నులోనలేని మహిమనందె.

ఒడలినిండ వ్రణములుండియు తారకా
బాహుబంధనమ్ము వలనవాడు
కాంతి మంతుడయ్యె కాంచనకేతనీ
భ్రాంతి గొలుపుమేని పసిమితోడ.

వానివలని రాత్రి వయసు వచ్చినదయ్యె
ఇరుల ముసుగులను హరించెనతడు,
వాని బుజముజారి ప్రాకె వెన్నెల వల్వ
నగ్నమైన నభము నడుము చుట్టు.

ఒక్కనాడు కూడ నొరుల బాధింపని
కరుణగలుగు నేస్తకాడువాడు
నేడు పెచ్చుపెరిగి ఏడు లోకమ్ముల
కౌముదీ మహాగ్ని గాల్చినాడు.

వాడు నన్నుగూడ వదలడు, పసినాటి
బాంధవమ్ము దూరపరచినాడు,
గుండెపగిలి కూరుచుండిన నామీద
రేయి యెండ క్రుమ్మరించినాడు.

నేను వానిమీద బాణమేయగబోవ
తారకొప్పులోన తాను డాగు,
ఆమెకొప్పుకేమి యాపద గలుగునో
యనుచు దించినాడ నంబకమ్ము.

ఆమె కొప్పులోన అతడు చేమంతియై
అందగించులే ప్రియమ్ము నాకు
అతడామె గలసి యసితాంబుదమ్ముల
నవల ద్రోయులే జయమ్ము నాకు

తనువు గాల్చునట్టి ఇనునకు వెరతుము,
మనసుగాల్చు చందమామ ప్రియము,
మనసు కాలినపుడె జనియించు నవకళా
దివ్యలోకమందు దీప్తి రేఖ

గాయపడిన గుండె కనిపించు చంద్రుడై
దేహమనెడు గగనదేశమందు,
గుండెలోననుండి కురియుజ్యోత్స్నవృష్టి
నవ్యకావ్య దివ్యనదమునందు

ఇట్లు తలపోయుచున్న నన్నెట్లు చూచె
నేమొ చంద్రుడు-భువికి లంఘింపజూచె
గాయ పడు నేమొయను భీతి కందువాను
రెండుచేతులవిచ్చి నిల్చుండినాను

భిక్షుకుని కరాల ప్రియురాలు విసరిన
హృదయ కబళమునకు ఉదహరింప
చందమామ తాను చనుదెంచి నా జోలె
వ్రాలినాడు- వట్టిజాలివాడు.

ఒడలెల్ల వెన్నెలలతో
తడియగ నను కౌగలించి, తాతెచ్చిన పూ
తొడవులిడినాకు, ప్రేముడి
కడలివలెన్ పొంగ, గుండెకదలగపలికెన్

"చిరకాలమిట్లు నినువిడి,
ధరణిని విడనాడి గగన తలమున నిలువన్
దురితము వాటిల్లె సుహృ
ద్వర! మన్నించెదవొ లేక దండించెదవో

నీతోనే నివసించెద
నీతోనీ మృత్తికా పునీతస్థలిలో
చేతః ప్రీతిగ నాడెద,
గీతములను వ్రాయుటందు కేలుగలిపెదన్

మనుజుడు పంపెడి కృత్రిమ
వనజారులతోడ గగనభాగము నిండెన్,
ననుగాంచువారలెవ్వరు
కనరారిక - నాకు దివిని కాపురమేలా!

నాపై దాడి యొనర్ప జూచెదరు
బాణవ్రాతముల్ చిమ్మి - జ్యో
త్స్నా పల్యంకశయానుపై అనలమున్
సారింతురే ? చంద్రికా
దీపజ్వాలిక నార్పజూచెదరు
గాదేవీరు - తారాసతీ
శ్రీపాణిగ్రహణమ్ము చేయుటకు
చేరెన్ కృతిమేందుచ్ఛటల్

నా పనిరైయె పోయినదిక
ఆపై సూర్యునికి గూడ ఆపదవచ్చున్,
రేపోమాపో దివిపై
కాపుర ముండెదరు మనుజగణములు మిత్రా!

భువినుండి పైకి వెడలితి
భువికే అరుదెంచినాడ—పోనిక తారా
సవిధమున" కనెను చంద్రుడు
చివుక్కుమనె నామనస్సు, చింతించితినే—

చంద్రుని కోసమై వెతలు సైచె,
తపోనిధియైన వృద్ధ మా
సీంద్రునిపిడె, నిందలనవెన్నొ
భరించె, నభో వినీల శై
లేంద్రమునన్ గృహమ్ము రచియించి
క్షయజ్వర బాధితాబ్జుని
స్తంద్రత గొల్పు చుండునది
తారక! ఆయమ కర్మమేమగున్

ఆయమ వీడివచ్చిన మహో
దురితాత్ముని చంద్రుకొట్టగా
బోయితిగాని శాంతిగొని,
పొంగెడి దుఃఖముతోడ మల్లికా
చ్ఛాయల కూరుచుండి సరసమ్ముగ
— వానిని తార చెంతకుం
బోయెడి నటు చేయుటకు
బూనితి—నిట్లని విన్నవించితిన్

"ఒకడు వచ్చి వ్రాలె. ఒక్కడు మరికూలె
ఒకడు లేచి లేచుచుండి వ్రేలె.
ఒకడు తిరుగుచుండె నిక రేపొ యెల్లుండో
కూలనుండె—బ్రతుకజాలకుండె

కాంతిలేని లోహాకంజారులనుజూచి
చింత చెంది భూమిచేరదగుసె.
వాని నెల్ల తార వలచునే యెందైన—
గుండెలేనివాని గోరునెట్లు?

హృదయమెల్ల అమృతనదిగా స్రవించెడి
నిన్ను బోలగలవె ఇన్ని శశులు
తారకా భుజాగ్ర తపనీయచేలమ్ము
నందుకొనునె కృత్రిమేందు గణము.

ఈ యజాండాకృతికి సూర్యుడిందుడనెడి
రెండు కన్నులు వెల్గొందుచుండు నెపుడు,
ఒకటి భువినెల్ల నిప్పుల నుప్పళింప
నొకటి కప్పురమున దేల్చు నుప్పరంబు.

నీవు వ్రాలెదేని దేవునికొక కన్నె
కానబడును-దాన కలదుమంట
దయనుగూర్చునట్టి ప్రియనేత్రమేలేక
అతడు ప్రాణికోటి నాత్రపరచు

చల్లనయ్యావు నీవుంట నెల్లజనులు
మండు వేసంగి భరియించుచుండినారు
పగటియెండను రేయెండవలని గెలిచి
ప్రేయసీ ప్రియులెట్లొ జీవించువారు.

హ్రాయమవీవు మాకు, మధురించెడి
కోర్కెల కొండమీద నీ
వుదయము కాగనే బ్రదుకులూయెల
లూగును-శాంతి చంద్రికా
స్పదమగు నీ నవాననము
ప్రాణులకున్ ప్రణయప్రకోపన
ప్రదము, నభోవిటంకమును
ప్రాకి మమున్ సుఖయింపజేయవే?

ఒక పక్షము మాపక్షముండి నీవు
మా వెతలుజూచి కృశియించిపోవగలవు.
ఒక్క పక్షమెరుల పక్షముండి వారి
పోడిమిని గాంచి ఉప్పొంగిపోవగలవు.

నలుపే అందముగా వరించిన
అనంతవ్యోమకాంతామణీ
విలసిద్దివ్యముఖమ్మునందు సొగసుల్
బింబించు గోరోచనా
తిలకంబీవు-తమఃప్రపంచమునకున్
దీపంబ వీ, వస్మదా
దులకున్ దగ్గరివాడ వెందులకిటుల్
దుఃఖించుటల్ చంద్రమా!

ఉచ్చపదవి నొందియున్న సిన్ దరిసించి
క్రిందినుండి మెచ్చుకొందునేను
అద్దమందు వెలుగు ముద్దుల ముఖబింబ
మసలు ముఖముజూచి యలరినట్లు" —

అతడు నాదు వినతి నంగీకరించెను
ప్రాణికోటి సౌఖ్యవార్థిదేల
కృత్రిమేందువులకు రీఢాకరమ్మయి
తరుణచంద్రమూర్తి తారజేరె !



# "తామసి"

ఇరులు నిశాసతీ భుజములెక్కి, శిరమ్మునెక్కి తారకా
తరుణి కపోలపాళికలు తాకి, విహాయసవీధి ప్రాకి, చం
దురు పయినోకి, భూమిధర దుర్గమ వీధులదూకి, మెల్లగా
ధరపయి కాలుమోపిన వుదారములై హరినీల కాంతులన్

ఇటుప్రాకి అటుప్రాకి ఇందు బింబాననా
ముఖముపై కస్తూరి బొట్టుపెట్టి
ఇటుదూకి అటుదూకి కుటిల నీలాలకా
భ్రుకుటికా ధనువు నంబకము కూర్చి
ఇటుసాగి అటుసాగి ఇందీవ రేక్షణా
పక్ష్మభాగములపై వచ్చిప్రాలి
ఇటువీగి అటువీగి మృగనేత్రి బంగారు
చెక్కిలిపై అగర్ చుక్క నుసిచి

వెండి కొండపయిఁ మబ్బువిధము దోచి
చంద్రకేదారమున లేడిచాయ తిరిగి
ఆదిశేషునిపై విష్ణువై శయించి
చీకటులు కూర్చె నందమ్ము లోకమునకు.

ఇరులు కోకిలములై ఎచ్చోట కూయునో
అచ్చోట మధుమాస మవతరించు
ఇరులె తుమ్మెదలుగా ఏవేళపాడునో
ఆవేళల వసంత మందగించు
ఇరులే మయూరమై ఎట నాట్యమాడునో
ఆటనే నవాషాఢ మావహించు
ఇరులె ఉత్పరములై ఏనాడు పూచునో
ఆరోజు కార్తి కమ్మాగ మించు

ఇరులకన్న అందమెచట కానగరాదు
ఇరులె సౌఖ్యములకు దరులు సుమ్ము
ఇరులులేనినాడు నరులు కానగరారు
నరులులేనినాడు ధరణిలేదు.

కబరీ భరమ్ములై కనుపించు చీకట్లు
కలకాల మందాలు చిలుకుగాత
నల్లకల్వలవోలె ఉల్లసిల్లెడు నిరుల్
కాసారములలోన గ్రాలుగాత
నీలమేఘమ్ములై నింగి బ్రాకెడి తమం
బాకాశమున నడయాడుగాత
జవరాలి కనుపాపచాయ దోచెడు సాంధ్య
మెదదలో వలపు వర్షించు గాత

ఇరులె కురులయి ఝురులయి పరుగులెత్తి
ఇరులె కరులయి హరులయి ఇంపునింపి
ఇరులె విరులయి సరులయి ధరణినిండి
ఇరులె నరులకు మరులు కల్పించుగాత.

తిమిరలతా కుడుంగమున దీపము పెట్టెడి వెర్రిదాన! దీ
పముపురు, వంధకారమొక పాము: పృదాకువు పుర్వుమెక్కునో
కృమి ఉరగమ్ము మ్రింగునొ గ్రహింపుమి! అంధతమో మహోతురం
గమ ఖురఘట్టనమ్ముల వికావికలైనవి దీపదీధితుల్.

వెచ్చదనము లేని వెర్రిదీపమ్ముల
పెట్టదలచెదేల పిచ్చిదాన.
వర్షధారవోలె వచ్చు చీకట్లలో
మట్టి దివ్వె నిలుచు మాటకల్ల

గాలినాల్కమీది కంటకమ్ములలోన
చిక్కుకొన్న యట్టి చిన్నపురుగు
అంధకారమందు ఆటాడుదీపంబు
మరుని మోసమునందు మడియగలదు

ఆకాశమ్మది చీకటిల్లు, శశితారార్కావళుల్ మిణ్గురుల్
లోకంబియ్యది చీకటింటి పరదాలో రాగు మృత్పిండ: మిం
దా కల్పింపగ జూచెదేల పరిహాసార్థమ్మొ! దీపావళీ
ప్రాకారమ్ములు? తానసీధరణి కంపంబల్లదే వచ్చెడిన్.

కానగు చెట్ల నీడల నొకానొక స్వప్నపు సెజ్జమీద ని
ద్రాణత హాయిగొల్పగ సదాశయనింపగనీ మహాంధకా
రాన మనస్సు శాంతిగొనె, గనుభవత్ కమనీయకాంతి సౌ
ధానకు. నన్ను పిల్వకుము తన్వి! విభావిభవాభిరామవై.



# * "ఊర్వశి"

నందనవాటికాతలముఁ నివసించెడి ఊర్వశీ! భవత్
సుందరదేహవల్లి పరిశుద్ధవిభాతమువోలె అందముల్
చిందు, హిమావగుంఠనము లేక నిసర్గమనోజ్ఞకాంతితో;
బందివికావు స్వైరిణివి ప్రాజ్ఞవు స్వాగతమే సురాంగనా!

అపరసంధ్యా ప్రశాంత సూర్యాతపమ్ము
శాద్వలమ్ముల కాంచనాంచలము విసర
గృహిణివై పయ్యెదబిగించి హృదయనాథు
నింట సందియదివ్వె వెల్గించలేదు

వజవజ వడంకు పాదాల, వడకుచున్న
వక్షమున, నమ్రనేత్ర మందాక్షశోభ,
శోభనాగారమును చేరఁజూడనటి
పెండ్లి యెరుగని ప్రణయ చాంపేయమీవు.

విషపాత్రయొక్కచే సుధాకలశమున్ వేరొక్కచే బూని నీ
వుషసిన్ క్షీరసముద్ర మందుదయమై, దోర్వాసులున్, రాక్షసుల్
ఋషులున్ మానవులున్ సమస్తజగముల్ కీర్తింపగా ప్రేమసం
తుషితస్వాంతమునన్ జగత్త్రితయమందున్ వెల్గినా వూర్వశీ !

---

* రవీంద్రుని రచనకు అనుసరణ

పుట్టినయప్పుడే యువతిపోలిక నిండగు యౌవనమ్మునన్
మెట్టితివీ ధరాతలము; నిన్ను శిశుత్వము చిన్నమంతయున్
ముట్టగలేదకే, పసిడిబొమ్మల చేకొని ఆడలేదకే
తొట్టెలలోన పట్టివలె తొంగలి రెప్పల నవ్వులొల్కుచున్?

వాయువు, నీవు త్రావిన నవాసవవాసనలూని ఓ జగత్
ప్రేయసి, ఊర్వశీ! పరుగువెట్టును మత్తిలి నాల్గుదిక్కులన్;
నీ అరుణాంబుజాత కమనీయపదమ్ముల మ్రోయు మత్త భృం
గాయిత శింజినీధ్వని ప్రియంబొనరించె కవీంద్రకోటికిన్.

చంచల కాంచనాంచల లసన్నవ వక్షము పొంగుదేర, నే
త్రాంచల బాణపాతముల ధ్యానసమాధి నిషణ్ణమౌ నిరాట్
సంచయ మానసమ్ములు ప్రసన్నములై అదిగో తపః ఫలం
బుంచెను నీపదాలకడ! ఊర్వశి! దాని పరిగ్రహింపవే!

ఒడలెల్లన్ పులకాంకురంబులు సముద్యోతింప నీ వాడినన్
జడరాశుల్ నటియించ బూనినవి స్వేచ్ఛాప్రవృత్తి; నీకంఠమం
దుండుహారమ్ము తెగన్ నభోంగణము నందొప్పారె తారారాళి;నీ
నడుమల్లాడగ మేఖలల్ తెగి దిగంతాలందు వ్యాపించెడిన్

సురలోకంబను పూర్వశైలమున సంక్షోభించు ప్రత్యూషసుం
దరివీ పూర్వశి! సప్తలోకములు నిన్ సౌందర్య సింహాసన
స్థిరసంవాసినిగా నెరింగి కొలిచెన్ దేవీ! మదీయాంతరాం
బురుహాంబందు భవత్ పదంబులిడవే పూజింతునే వేళలన్.

కొంకులు తాకునట్లసిత కుంతలముల్ విరబోసి నీవు. మీ
నాంకుని ఆడురూపమయి నావు దిగంబరి! దివ్యకాంత! ఎ
ణాంకుడు పశ్చిమాంబునిధియందు మునింగినయట్టులింక నా
వంకకు రాకపోయెదవె పైదలి! అశ్రులుదోయిలించినన్

పొంగిన నీ ఉరోజముల పొంకము, నీ చెలువంబుజూపుక
న్నుంగవ, నీ కపోలములనున్న దనంబు, యుగాలుపాడినన్
బొంగురువోని నీగళము నొక్కులు దేరిన నీనవాలకల్
నింగియు నేలయుం బలెనెనిల్చును శాశ్వత యౌవనంబునన్



# "దీపాంగన"

దీపశిఖనిల్చినది పురంధ్రీలలాట
పట్టిదీర్చిన కుంకుమ బొట్టువోలె;
దీపశిఖపిల్చినది; చనుదెంచినాను
తనువు తనువెల్ల ఆజ్యపాత్రమ్మువోలె॥

ఎరకలు వచ్చెనా యెడద కిప్పుడు,
దీపకుమారికా భుజాం
బరమున పోయి వ్రాలెదను; పాడెద,
మంచులు పేరినట్టి ఈ
ధరణి జడత్వ మూడ్చుటకు తాపము
పెంచెద, వేడిలేని ఈ
పరిసరముల్ కవోష్ణరసవారిధిలో
నెసలాడ జేసెదన్॥

నాకుఁ దీపశిఖాకుమారికకు ఈనాఁడా!
శతాబ్దాల ముం
దే కానుండెను పెండ్లి; కాని పవన
ద్వేషమ్ము దీపానకున్
నాకున్ మధ్య నఘాతముల్ నిలిపె;
నైనన్ దాని చేలాంచలం
బాకంపించె మదీయ శీర్షమున
ప్రేమామోద సంవాహమై॥

శలభమనైన నన్ శరభ సామజ
సింహబలంబు లిచ్చి ది
వ్వెల దొరసాని పెంచినది, ప్రేముడితో
ముడివేసి వానగా
ఢ్పుల తొలిదాడినాఁడు నను బ్రోచిన
దెంతటి రాగబంధమో!
చలియన లేదు దీపక భుజా
భుజగీ పరిరంభణమ్మునన్॥

బందీ యయ్యె జగమ్ము దీపకశికా
ప్రత్యగ్ర బాహా యుగం
బందున్ నా యెదవోలె; అంధ తమస
వ్యాధూత కోకారి వ

న్నిందా బంధురలోకముల్ విడచి
మద్దీపనాం లింగ నా
నంద స్యందన మెక్కి రివ్వుమని పోనా
స్వర్గమార్గములన్॥

ప్రతి యింట చిన్న ప్రమిద వెల్గించిన
అవిరళస్నేహ రాజ్యాధిరాజ్ఞి,
ప్రతిగుండె నొక ప్రభాప్రతిమ నిర్మించిన
కల్పనా నల్ప శృంగారరాణి,
ప్రతి తోటలో నవప్రసవమై విచ్చిన
కాంతార కాంత వాసంతలక్ష్మి,
ప్రతిమానవీ ముఖాంబరమందు వ్రాకిన
గోరోచనా చంద్రచారుమూర్తి

దీపభామిని, ఆశాతి దీప్తకీర్తి,
మంచు కరగించి, వేడికల్పించి, వాగ్వి
పంచి సవరించి వాయించి ప్రకృతినెల్ల
మూర్ఛ తేరిచి చేతనాంబుధిని దేల్చె॥

కాలిన రెక్కలన్ పులుగు కైవడి
నీ పదకంజ సన్నిధిన్
వ్రాలితి. నిన్ను మ్రింగుటకు
వచ్చిన గాఢపు దుండగినితో
ఆలమునేసి గెల్చుకొనునప్పుడు
రెక్కలు కాలిపోయె నీ
జ్వాలలసోకి; నీ కొరకు ప్రాణములైన
పణమ్ము వెట్టెదన్॥

నీలో తేజము తగ్గిపోవునెడ నందింతున్
కవోష్ణాస్రమున్
తైలంబట్టుల - అశ్రుధారలను
సంతప్తాజ్యధారంబలెన్;
జ్వాలాచేలవిలోల తావక వపుర్వల్లీ
విలాసంబుతో
భూలోకంబును సొంత మొక్కత్రుటి
సమ్మోహింపగా జేయవే॥

నన్ను స్నేహము చేసికొన్నావునీవు
వెల్గుచున్నావు నా మనః పీఠిపైన
ప్రతిరుధిర బిందువును సమర్పణ మొనర్చి
నిన్ను వెల్గించుటకు మరణింతునేను॥

నీ కేలా పరిచుంబితంబయిన నా
స్నిగ్ధాధరోష్ఠమ్ముపై
ప్రాకెన్ కమ్మదనాలు ద్రాక్షరసమై, ప్రత్యగ్ర
మాధ్వీకమై;
లోకాతీత సుఖమ్ము కూర్చినవి నీ
రోచిష్ణు బాహాయుగ
ప్రాకారాంతర జృంభమాన
లికుచాభ స్వర్ణ వక్షోజముల్॥

వెలుతురు మొగ్గవై బ్రతుకు వీధుల
నూత్న పరీమళమ్ములన్
జిలికిన నీకు గాను విరచించితి
గుండియ కొండమీద ది
వ్వెల రతనాల మేడ, పదవే అట
నుందువుగాని. కోటి గుం
డెల వెలిగింప గల్గు రమణీ నిను
గాదుపు పాలోనర్తునే॥

నీ నృతిజూచి లోకము ఖణిల్లను
గజ్జెలతో నటింపగా
బూనెను, జారిపోయినదిపో, భవ
దంస గతాంబ రాంచల

శ్రేణి, కటిఁ పటంబు శిథిలీకృతమయ్యె.
వివస్త్రి వైతివే
రాణి, * రవీంద్ర కల్పిత విలాసిని,
ఊర్వశివోలె. దీపికా!

నిను కౌగింటను గొన్న నా తనువు పోనే
పోవుగానీ, భవత్
తను తేజః పరీణాహపింజరితమీ
ధాత్రీతలంబెల్ల, ఆ

త్మను గాఁజేసి వసింతు సప్త జగతీ
మధ్యమ్మునఁ దీప భా
మిని ప్రేమించిన దీప్తిమంతుడనుగా
మిన్నెక్కి క్రీడించుచుఁ॥



---

* రవీంద్రకవి ఊహించిన ఊర్వశి వివస్త్ర

# "చీకటినటి"

తెరలు తెరలుగా చీకటి
దిగెను జగతి నడినెత్తిని
ఎంతని ముట్టించగలను
ఈ దీపపు చిరువత్తిని?

చీకటి శిల తెచ్చి చెక్కె
శిల్పియొకడు ప్రతిమనొకటి
అతని ఉలిముక్కు జల
మ్మనగా అది యయ్యెనటి

దీపాలను దిగ్భ్రమింగెడి
పాపి సఖి చీకటినటి!
అందుకొనగ చేయిసాచ
అందబోదు దానికటి

అందమైన చీకటినటి
కందరు 'వందే' యందురు
చురుకగు నాయమ నల్లని
చూపుల బందీలందరు

నా గుండియ వితర్దిగా
నాట్యము సాగించినది
ఇక తూరుపుదెస వెలుతురు
తెగయవో అనిపించినది

వెలిగించితి క్రొవ్వువత్తి
పేల్చివేయ పెనుకానుగు
క్రొవ్వువత్తితో ఈల్గునె
క్రొవ్విన చీకటి ఏనుగు?

అంతలోనె అరుణ పద్మ
మటుల విచ్చె తూర్పున శశి.
బ్రతుకులోని చీకటి విడి
పగలనిపించినది నిశి.



# "చేతనా జ్యోతి"

ఒక పరిజాళువా మెరుగు లొల్కెడి జ్వాలిక,
ఒక్కమారు మ
ల్లిక కుసుమించినట్లవతరించెడి కీలిక,
ఇంద్రనీల వ
ల్లిక వలె నొక్కనాలుక వెలింగెడి దీపిక
తోచెనాకు, గై
రికల వెలుంగు హైమశిఖరింబలె
ఉత్తర దిక్కువైపునన్॥

కొప్పువలె ధూమరేఖను కూర్చి చుట్టి
పూవుగా ఒక జ్వాలను పొదిగిపెట్టి
పైటగా ఒక్కకీలను వైచినట్టి
దీపికా గోపికా పురంధ్రికి నమస్సు॥

కామినీ ఫాలభాగాన గోరోచనా
తిలకమై వెలిగెడి దీపమొకటి,
సుందరా రామాన మందార కళికయై
నవ్వుల గురిపించు దివ్వెయొకటి.

కాసార నవజల ప్రాసాదమునుండి
నళినమై తోచు తిర్వెళకయొకటి,
అపర సంధ్యావేళ అస్తాద్రి శిఖమీద
సూర్యుడై కొడిగడ్డు జ్యోతియొకటి,

కామినీ నయనమ్ముల గాంచనొకటి
ప్రేయసీ హృదయాన కన్పించునొకటి
బాహిరంబైన వెలుగును పరచునొకటి
అంతరంబైన కాంతినీయగల దొకటి॥

ఎవరు పుట్టించినారే ఈ ప్రదీపమ్ము
లెవరి గుండియమంట కివ్వి వ్యాఖ్య,
లెవరు కల్పించినారే ఈ విభా తోరణా
లెవరి గేహమ్ము లాళించెవీని,
ఎవరు పోషించినారే ఈ ప్రభావల్లి
నెవరితోట పరిమళించు కొరకు,
ఎవరు నిర్మించినారీ కాంతి సౌధమ్ము,
నే ప్రేమదేవి వాసించు కొరకు,

ఎవ్వరే ఎవ్వరే ఇట నెవ్వరెవ్వ
రంధకార బంధుర హృదయాంగణమున
వద్దు వద్దన దీపాల పంక్తి పేర్చి
విరుగబడి నవ్వుచున్నారు వెఱ్ఱివారు?

నాకు బంధువులచే నలిన బాంధవతేజ
మొలకబోసెడి దీపకళికలార,
నాకు స్నేహితులచే చీకటిగుండియ
కలవరపెట్టు తిర్వ్వాళకలార,
నా సహోధ్యాయులేనా నన్ను కాపాడ
వచ్చిన వహ్ని పుష్పమ్ములార,
నా వోలె బాధాపి నద్ధమానసముల
నరుదెంచు జ్వాలాజయంతులార,

చారు కాశ్మీర వర్ణశృంగారచేల
నెదపయిన్ నృత్యమొనరింప పదును దేరి
ఎఱ్ఱబారిన నయనమ్ములే ప్రదీప
ములుగ నరుదెంచు సఖులార! పలుకరేమి ?

నిశ్శబ్దమ్ముగ ప్రేమకుండ గతవహ్నిన్
భస్మమై పోవు ప్రే
యశ్శీలుర్ గదమీరు! నా బ్రతుకు
నాజ్యంబట్లు మీకిచ్చి మీ
దోశ్శాఖాచలిత ప్రభాంచలము చేతుల్
కాలినన్ ముట్టెదన్
నిశ్శంకంబుగ మీ పథంబువలె పోనిత్తున్
జగద్వ్యాహమున్॥

హరివిల్లువలెవిచ్చి ఆకాశ భూదేశ
ములకు కిర్మీరతాకలనకూర్చి
పూర్ణిమా సాంధ్య కర్బురశశాంకునివోలె
ఉదయాచలమ్ముపై పదముపూని
అకుసుంభరాగ విన్యస్త మానసమట్లు
నిశ్చలమ్ముగ హవణించి మించి
పై చూపుకన్నను లోచూపు మిన్నను
సూక్తికి వాస్తవ ద్యుతులునించి

అజ్ఞతకు బద్ధ శత్రువై, అవికలాంత
రంగ సద్బంధువై, త్యాగి సంగమునకు
ప్రోత్సహించెడి గురువయి, ప్రోజ్జ్వలించు
జ్ఞానదీపమ్ము విశ్వమ్ము కాచుగాక॥

గుడిసెలో నొక చిన్నికూన కన్నులలోన
నవ్వులు చిలికించు దివ్వెయొకటి,
బంగారు మేడలోపల క్రొత్త కోడలి
చూపుల నాటాడు దీపమొకటి,
గగనాంధకారాన సొగసైన మోముతో
ధగధగ మెరసెడి తారయొకటి
ఉరువలాహక శయ్య నొంటిగా శయనింప
జాలక పొరలెడి చపల యొకటి.

ఒక్కటొక్కటే యేతెంచి రెక్కబట్టి
లాగుకొనిపోవు నన్నెదేలా ? అగాధ
బాధలోనుండి ఆనందగాధలోని
కీడ్చుకొనిపోవ యత్నించు నేలనన్ను?

ఎరకలు కాలిపోవునని యెంత యెరింగియు
గూడ దీపికా
తరుణిసమీప గూహనము తప్పుకొనక
ప్రయత్నింపబోని, ఈ
పురుషుల ప్రేమ బంధమును బోలునె,
గొప్పలు చెప్పుచున్న ఈ
నరుల యథానుకూల
కుహనావచనాంచిత రాగ బంధముల్



# "ఆ శా సౌ ధం"

వుండడానికో సౌధం
వుండక పోయినాగానీ
ఆశాసౌధాన్నైనా
అధిరోహిస్తే తప్పా!

నా ఆశాసౌధం గోడలు
నరులే! దానవులు కారు;
నా ఆశాసౌధం నీడలు
నావే! నరపతులవి కావు.

కొందరు పరాయినీడల్లో
వుందామనుకుంటారు;
తన్నినప్పుడల్లాను
తన్నులు తింటుంటారు.॥

నా నీడే నాకువుండగా
పరాయి నీడలు దేనికి?
నా గోడే నాకుండగా
పరాయి గోడులు దేనికి?

అంతా వెనకటేవుందని
ఆనందపడే పెద్దలు
ఇవాళ యేమీ లేదని
యేడ్పు మొహం పెట్టారు.

వాళ్ళ యేడ్పు పోగొట్టే
వసంత సమయాలెన్నడో
వాడిపోయి ఈ నాటికి
వర్ష ఋతువు వచ్చింది!

విశాల భూలోకాన్ని
విడగొట్టి దేశాలుదేశాలుగా
తన్నుకు చస్తున్నారు;
ఎక్కడి ఖర్మం బాబూ! ఇది.

మనిషి మనిషినీ విడగొట్టే
ధనాన్ని నిర్మూలించామంటే
నరులంతా యేకమై
సురలోకం నిర్మించరూ?

ఈ నాటి ఆశాగీతికి
భవిష్యత్తు ప్రతిధ్వని;
ఈ నాటి నెగెటివ్‌కి
భవిష్యత్తు పాజిటివ్.

భవిష్యత్తు అనగానే
భయపడతారెందులకు?
వర్తమానపు పునాదుల్లో
భవిష్యత్తు నా సౌధం ॥

కొంపలు గోడలు లేనీ
కూలీ రైతుల్లారా!
అంతా రండయ్యా! నా
ఆశా సౌధంలోకి

ఆశాసౌధ గోపురాన
అదిగదిగో ఇంద్ర ధనువు;
ఆసౌధం వాకిటిలో
సామాన్యుడికి స్వాగతం ॥



## "జలద సరస్వతి"

ఆకసము జూచినంత గ్రీష్మాతపాతి
భీకరంబయి గుండియదాక మండు;
లోకమెల్ల పయోధరా లోకనార్ద్రి,
శీకరస్నాన సౌఖ్యమాశించు నేడు॥

నల్లని వేణికాభరమునన్
రవిబింబము డాగిపోవగా
చల్లని చూపులన్ మొయిలు
జాడల వైద్యుతవల్లి కాఁవల
గ్నొల్లసి తాంగిరై యె ఉరము
లూరక గజ్జియలల్లు మోఁయ, నా
యుల్లమునందు వార్షుక
పయోధర భామిని నాట్యమాడెడిన్॥

అదిగో! పశ్చిమ వార్ధిసాచిన
కరంబై మేఘమే వచ్చుచు
న్నది. మార్తాండుని చేయి పట్టుకొని
పంతంబార కొంపోవుచు
న్నది; గ్రీష్మాతప తప్యమాన జన
చింతా స్వాంతముల్ శాంతిలున్
గద! నీలాంబుధర ప్రమోదకర
తద్గర్జాని నాదమ్ములన్ !

కామినీ ధమ్మిల్లకంబయి తూర్పున
చిరుమబ్బులే తున్క చెఁగలించె,
ప్రేయసీ భుజలతా వేల్లి తాఁచలరీతి
నొకమబ్బు దక్షిణానకు తొలంగె,
భామా పయోధర భారమ్ము తలపింప
నొక మేఘ ముత్తరానకు చరించె,
కాంతాపదాంక సంకాశమ్ములై మబ్బు
ముక్కలు నడిమింటి కెక్కినిలచె,

వివిధ ముద్రలతో నాట్యవేదపైన
నృత్య మొనరించు నర్తకి రీతిదోచె
తీవ్రవాతూల పటుపటు ప్రవజ్రప
ఘాత సంధూత జీమూత గణమునేడు ॥

చేజేయి కలిపి పచ్చిక బయళ్ళ చరించు
నూత్న దంపతియయ్యె నొక్కమబ్బు,
విరహాబాధాతప్త తరుణియై తలవంచి
కన్నీరునించె నొక్క జలదంబు,
స్నానమాడుటకయి నదికేగి నీరాడి
చనుదెంచు తన్వియోజనొక మేఘు,
మాలింగనార్థినియై బాహువులు సాచి
ఉరికి వచ్చెడికాంత ఒక్కమొయిలు,

నేనెనై మిన్నుదారుల నిలచునొకటి,
తానయై వ్యోమభాగాన తరలునొకటి,
విడివడిన ప్రేయసీ ముఖబింబమూని
ప్రక్కప్రక్కన నిలుచుండ వచ్చునొకటి ॥

నవనీరద రథమ్ము నడిపింతు దివిదాక
పవమాన జవనాశ్వ పటవిబూన్చి,
మందాకినీ కంజ సందోహ గంధమ్ము
నిండింతు నీ భూమిమండలమున,
ప్రమోదినీ వల్లికా వ్రాతముల్ తెచ్చి నా
తోటలో నీటుగా నాటగలను,
నరులతో సురల చుట్టరికముల్ పెరుగగా
ధరకు నాకమును తొందరగ తెత్తు,

భూదివము లేకమై కాంతిపుంజమట్లు
నీల నీలాంబరమ్మున తేలియాడ
అచ్చరల వెంట మేఘ పల్యంకి నెక్కి
వానదారుల పయనింప వలతునేడు ॥

మేఘమందు నాక మోఘమ్ము సంప్రీతి
మబ్బు పంచభూతమయమె కాదె!
అంతెగాక దాన నలరారు కరుణమ్ము
గుండె కంటినీటి కుండ గాగ ॥

మబ్బులోన విందు మదవతీ పాద మం
జీర యుగళ మంజు శింజితమ్ము
మబ్బులోనకందు మానినీ నయనాంత
గళిత బాష్ప బిందు కణగణమ్ము ॥

మూగివానినోట రాగాలు పాడించ
ఇసుక నేలలందు మిసమినించ
సాగివచ్చె నేడు జలదసరస్వతి
కాళ్ళ హంసకములు గల్లుమనగ ॥



# "మహాంధ్రి"

నాలుగుకోట్ల తెల్గుల మనంబులలోన
మహాంధ్ర లక్ష్మి దీ
పాలను పెటినట్టి శుభవాసరమియ్యది!
నూర్ల యేండ్ల స్వ
ప్నాలు నిజాలుగా మొలచి పందిరి ప్రాకి
సుమాలుపూచి లో
కాలకు సౌరభమ్ములను కానుక పెట్టిన
రోజు-పైదలీ !

అటుపోయి 'కృష్ణ' లో నటనంబు లొనరించి
సిక్త చేలమ్ముతో చేరరమ్ము,
ఇటుపోయి 'గోదారి' ఇసుకతిన్నెల ధూళి
పాదాల పారాణ వై చరమ్ము,

ఇటు 'పినాకిని' కౌగిలింతల తడిసైన
వక్షమ్ము పొంగార వచ్చిపొమ్మ,
అటు మంజు 'మంజీర' మడుగుల గల్లన
ఒయ్యారముగ నడలూది రమ్మ.

కావిరంగు చీరధరించి; కారునలుపు
పయ్యెదపయిన్ జరీ బుటాపని సెలంగ
ఫాలభాగాన దీపమ్ము వలె తిలకము
వెలుగులొలికింప రావమ్మ తెలుగుచాన ॥

బ్రతుకు విపంచి మూగవడి పాడక యుండిన
తీగతీగ కు
న్నతి గలిగించి, అంగుళులతాకి
పదమ్ములు పాడు మా సర
స్వతివి, మరాళవాహనముపై నొక మా
రిటువచ్చి పొమ్మ. మా
నతులను స్వీకరింపుము కనచ్చర దిందు
వ పుర్విలాసినీ ॥
ఓరుగల్లు పురాన నుదయించి గగనమ్ము
ప్రాకిన తెల్గు పతాకమీవు,
విద్యానగరమందు విప్పారివెల్గిన
సాహితీ చంద్రమశ్శకల మీవు,

ఇక్ష్వాకురాజుల కిలవేలుపైనంది
కొండనుండిన మల్లెదండ వీవు,
కొండవీటి సెలంగు దండివీరుల భుజ
దండమ్ము దూకిన చండివీవు,

పోతనామాత్యు భాగవతాది మధుర
గీతికలలోన పలికిన కీరమీవు,
కవికలమ్మున గళమున చవులుగూర్చు
స్వామినీ! కవితా సరస్వతివి నీవు ॥

నీవు లేకున్నచో నేనేడ జగమేడ
దారిలేనట్టి యెడారిగాక,
నీవు రాకున్నచో భావమంజరులేడ,
శిశిర జర్జర వనశ్రేణిగాక,
నీవు లేకున్నచో నిత్యయౌవనమేడ
వార్ధక భ్రష్ట జీవనముగాక,
నీవు రాకున్నచో నింగి తారకలేడ
గాఢాంధకార మేఘములెగాక,

అఖిల సారస్వతోద్యానమందు, పొగడ
పూవమై గుమ్మనెడు నిన్నుపొగడ తరమె,
రమ్ము! నా రసవా నృత్యరంగమందు
నర్తనము సేయవమ్మ ఆంధ్రసుకుమారి !

తిరుపతి కొండపై తిరిగి వత్తమురమ్మ!
శిఖరాగ్ర సితమేఖ చేలమూని,
భద్రాచలముపొంత పవ్వళింతము రమ్మ
శ్రీరామ సీతా ప్రసిద్ధభూమి.
శ్రీశైల వనముల చేరిపోదమురమ్మ
మల్లికార్జును దివ్యమహిమ నెంచి
సింహాచలమ్మున చెంగలింతమురమ్మ
కొండమల్లెలు మెడనిండదాల్చి.

అడుగడుగునందు నందనోద్యానములయి,
అంగుళమ్మంగుళమ్ము పుణ్యస్థలమ్ము
గా వెలయ తెల్గునేల సింగారమొప్ప
తెల్గుదనమొల్కవే దశదిశలలోన.॥



# "వాగ్వజ్రం"

మనిషి మనసును గెలుచు మాటనారాధింతు
మాటలోపలి వజ్ర మర్యాదనెంతు

మనసులోపలి బండలను చెండగలమాట
మనిషిలోపలి దౌష్ట్యమును ద్రుంచగలమాట
హిమగిరీంద్రమునెక్కి ఎగసిపోగలమాట
అమృతభాండము తెచ్చి అందించగలమాట

రాక్షసుని గుండెలో రాతిని ద్రవింపించి
భిక్షువుకు బ్రతుకుపై ప్రీతి కల్పించి
కత్తులకు తలవంపుగావించి, క్రొంబూల
గుత్తులకు రాగ సంపత్తి జోడించి

రణదాహ ఘోర తాపమున బీడై యున్న
మనిషి మేధాభూమి మరలపండింతును.
మనిషి మనసుకు శాంతి మధువురుచి చూపించి
యుద్ధ విష పాత్రికను బ్రద్దలొనరింతును

కత్తులా? మనుజలోకము పూనవలసినది?
పుత్తడిని చేబూని మురియవలెనా మనము?
సకలార్థములకు పోషకమైన మనసుపై
స్వారిసేసెడి శబ్దశక్తి నారాధింతు

మాట కడుపున నున్న జ్వాలపై కెగసెనా
మరి పయోధులె యింకు మందరాద్రి వడంకు,
నరహోమమునకు సన్నాహమ్ము లొనరించు
అసురగుండియల వజ్రప్రహారము జరుగు

నరజాతి చించి చెండాడ లేచిన చేయి
తెగి నేలబడును నాసొగసు పద్దెపుజడికి
పొగరెక్కి కోట్లడబ్బును కిరీటమ్ముగా
తగిలించుకొన్న గర్వికి భయము నా సడికి

మనకు తల తెగగొట్టు పనిలేదు. డబ్బుతో
కొనుబాధ లేదు మానవుని నీ విపణిలో;
రమ్ము! సూటిగ హృదయరంగాన నటియించి
రాక్షసిని దేవతా రమణిగా మలచుదము

లంకగా గాక కైలాసమ్ముగా జగము
గణించునటు పునారచన చేతమురమ్ము!
ఈ పునారచనలో ఎవ్వనిది పై చేయి?
కవిది, లోకజ్ఞునిది, గంభీరునిది, నీది.



# "మధ్యప్రాచ్య మహాయజ్ఞం"

ప్రజాస్వామ్య యజ్ఞానికి
ఫలితం కనపడుతున్నది
గాజుబుగ్గ పగిలినట్టు
రాజరికం విడుతున్నది

నిన్నదాక నిదురించిన
అన్నా! మేల్కొన్నావా?
తతుకులను యజ్ఞవాటి
శిక్షిస్తున్నావా ?

ధనంమీద కోర్కిమాని
జనంమీద ప్రేమబూని
ప్రజాద్వేషి వర్గాలను
పతనం చేస్తున్నావా ?

మతం మత్తు వదల్చుకో
మానవులను పిల్చుకో
ప్రాణాలను పణంపెట్టి
ప్రజాబలం తేల్చుకో

కన్ను తెరచి పిరమిడ్లే
మిన్నుమన్ను చూస్తున్నవి
అఖిల మానవులవైపే
అరబ్ జాతి వస్తున్నది

తెల్లపెత్తనందుల్లెను
దేవుడత్తుతలు చల్లెను
అరబ్ జాతి నిరుపేదల
ధరణి విడిచి కనివెల్లెను

పరాకుతో నిద్రించే
ఇరాకురాజుల ఇంట్లో
ధరాకంప మేతెంచెను
కిరీటాలనే దించెను

గెలిచినాడు మానవుడే
క్రిందపడెను దానవుడే
ప్రజాస్వామ్య నవపతాక
ప్రాకిపోయె నింగిదాక

సత్యానికి గెలుపన్నది
సత్యంరా మానవుడా!
అన్యాయంతో స్వర్గం
అందదురా దానవుడా!

సర్పయాగ మొనరించే
జనమే జయులారా!
వేయికండ్లతో శత్రుల
వీక్షిస్తున్నారా!

యజ్ఞఫలం దొంగిలించ
నరుదెంచే వారి నొంచ
జాగరూకులై చూడుడు
స్వాతంత్ర్యం కాపాడుడు

* నీలనదీ జలధారలు

నరాలలో గలవారలు

స్వాతంత్ర్యోద్యమ వీరులు;

వారికివే జోహారులు.



* River Nile

# "ఎవరి పాదచిహ్నము లివి?"

ఎవరి పాదచిహ్నములివి?
ఎవరి పాదచిహ్నములు?

ఆతని ప్రతిఅడుగు గురుతు
ఆలయమై తలయెత్తును
ఆతనిచేయి గొడుగు క్రింద
అఖిలజగము శయనించును.

దానవులను కరగించిన
మానవుడత డెవ్వడు?

గుండెనొడ్డి తుపాకీల
గుండె పగులగొట్టె నతడు;
రాటంతో రణశూరుల
ఈటెల నెదిరించె నతడు

హిమాలయము కన్న నెత్తు
ఎవడాతం డెవ్వడు?

ప్రతి మానవు హృదయమ్మున
నొదిగిపోవ జాలు నతడు,
విశ్వములో ప్రతిప్రాణిని
ప్రేమించగ జాలు నతడు

కత్తికి కన్నీరుగూర్పు
కరుణా కరుడెవ్వడు?

విష మిచ్చినవాని కమృత
చషకమిచ్చె నాతడు,
కారాగారము స్వర్గము
గా మార్చె నాతడు

తరతరాల మన సంస్కృతి
తానై నిలిచిన దెవ్వడు?

"ఓపిక" రూపం దిద్దుక
ఉరికివచ్చు నతనిలో-
"శాంతి" శరీరమ్ము బూని
సాగివచ్చు నతనితో-

"మంచి" మరాళము వోలిక
మసలు నతని మనసులో.

"క్షమ" శిశుశశి నవరేఖా
సదృశమయ్యో నతని శిరసి
"ఔదార్యం" అతని నుండి
అమర వాహినిగ దూకును

ఎవరిని తనువు గతాగతము
లేకమైన యటులతోచు?
ఎవని చిన్ని నివాసము
అవనికి కైలాసము?

గుండెలలో ఆతడున్న
కొంచెము సేపాపుడీ
కన్నులలో ఆతడున్న
కాస్త నాకు చూపుడీ!

ఎవరి పాదచిహ్నము లివి
ఎవరి పాదచిహ్నములు?

# "మహేంద్రామృతము"

రక్తకాంచన తరుప్రతతి శారదవేళ పూవులతో పొంగిపోయినట్లు
శశికాంత పాషాణచయము వెన్నెలలలో కరగి నీరై కాల్వ
గట్టినట్లు,
చంద్రబాహుద్వయీ సాంద్రోపగూహమ్ము కల్హారమునకు
పుల్కలిడినట్లు
రాజహంసీ గరుద్రచిత బాలతరంగ రంగవల్లి సరోజలమ్ములట్లు
తరతరమ్ముల చీకటి బరువులుడిగి, వానమబ్బుల కర్దమపథము
కడిగి
నాల్గుచెరగు లొక్కటైయైన నాల్గుకోట్ల తెలుగులోకాన
చైతన్య మలమికొనియె.

ఒకవైపు కృష్ణవేణిక ఉబ్బితబ్బిబ్బులై సాగి తెల్గింటసేసపెట్ట,
ఒక క్రేవ గోదావరికి హర్షల హారికానాట్యంబు ప్రస్నందనంబు
గూర్ప
ఒకప్రక్క తుంగభద్రకు చాయవెన్నెల కెరటాలు తెలుగు
సంబరము చేర్ప
ఒకదారి మంజీర చకపికనడలతో తెల్గుతల్లికి తరితీపుసేయ,

సుజలమై తెల్గుతల్లి సంశోభిలంగ, సుఫలమై తెల్గుధాత్రి
విస్ఫూర్తిజెంద,

బిదరుపురినుండి వంగాబ్ధివేలదాక ఏకమైపోయె తెల్గువారిల్లు
నేడు.

ఎన్నినాళ్ళ స్వప్నమిది సత్యమైనది? ఎన్నినోళ్ళ పిలుపుకిది
జవాబు?

నాల్గుకోట్ల వికచ నాళీకములు గల ఆంధ్రసరసి కిది మహో
ప్రభాతము.

వానతెరలు తొలచివచ్చిన శారద దేవతాకరస్థ దివ్యపాత్ర

తొణకి అమృతధార దోసిటంబడినది త్రావుడాంధ్ర పుత్రులార!
మీరు.

# "విస్మృతి పానపాత్ర"

విస్మృతి పానపాత్రయయి వెచ్చని శీధురసమ్ముతోడ-ని
న్నే స్మరియించు నాకొరకు నేడరుదెంచునుగాని గాటమౌ
నీ స్మిత రేఖ నాహృదయు నీరధరమ్మున ప్రోదినీ లతా
విస్మయకృత్ప్ర భాపటలి పెంపుననిట్టె తలపించు నంబికా!

నెలమొలక తలఁజెక్కి ఇలనున్న ఇరులెల్ల
తరలించ నరుదెంచు దైవతమవు
గంగాంబుభంగాళి పొంగించి ఆకాశ
భూదేశముల్ నింపు పుణ్యానదివి
మంచువై అంచవై మల్లికా వల్లివై
వెన్నెలై వెల్లువై వెల్లుసతివి
మగువవై మగనివై జగతికే ప్రగతివై
జననివై నరులపై కొనెడు ఉమవు

ఆదిలక్ష్మికన్న ఐరావతముకన్న
కౌస్తుభమ్ము, కల్పకమ్ముకన్న
అసలు తల్లికన్న అధికురాలవు నీవు
అందరికిని తల్లివగుట కతన.

తల్లివై పక్వామ్ర తరువు నెక్కించెద
వెన్నిపండ్లైన భుజించు మనచు,
అక్కవై ఆకాశమంత పైకెత్తెద
వెంతగానైన గర్వించుమనుచు,
నవవధూనికవుగా నన్ను లాలించెద
వెన్నొన్నజన్మల బంధమిదియటంచు,
చెల్లెవై నన్నుగిచ్చి పరుంగులెత్తెదు
కోపతాపాలు రాగూడదనుచు

మాతృదీప్తి, వధూనికా మధురతృప్తి
సోదరీత్వం పరివ్యాప్తి పాదుకొనిన
విశ్వమాతవు; నినుపోల్చు విధమెరుంగ;
పార్వతివో, పద్మవో, సరస్వతివో, జనని!

ఒకకొన్ని జాజిపూలకు కేలుసాచెడి
వనము వోలినది జీవనమునాది
ఒక కొంత గానమ్మునకు వీను నిక్కించు
నినువు బోలినది మానసమునాది

ఒక చిన్ని వెల్గురేకకు నేత్రపుటి నిచ్చు
తమ్మిపోలినది అంతరమునాది
ఒక కొద్ది తీపి మాటకు ఉబ్బి తబ్బిబ్బు
లయిపోవు చిరుతప్రాయమ్మునాది

నీవు నవ్విన నవ్వితి. నీవుకంట
నీరువెట్టిన ఆనీటి ధారలందు
కొట్టుకొనిపోతి లోకాల కొట్టకొసకు,
తిరిగి రానైతి దుఃఖసాగరమునుండి.

నిను మరచిపోవ బ్రయతించితిని, సవిత్రి !
మరపురాదేమి? గుండియ తెరలు తొలఁచి
కెరలిపడెదేమి? క్షీరసాగరముపోలె
ధరణి ముంచెత్తు నమృతాంబుధరముపోలె.

పగుల గొట్టితి విస్మృతి పానపాత్ర,
బ్రతుకు బ్రతుకెల్ల నీకయిపరచినాను
అమృత సింహాసనమ్మునై అధివసించి
ఏలుకోవమ్మ పదులోకాలు నేడు.

---

# "వధూనిక"

ఎదపొదలో జిక్కి ఎటు పోవజాలని
లేడికి మేత కల్పించునెవతె
కన్నీటివానలో కడునాని రెక్కలా
డని పక్షి నొడినుంచు కొనునదెవతె
దుఃఖ ఝుంఝానిలోద్ధూత పుష్పమునకు
కబరికాపీఠమీ గలుగునెవతె
ఆకురాలిన గుండె మ్రాకు కూకటిలోన
చిగురుటకుతలను చిమ్మునెవతె

పలుకజాలని భగ్నవిపంచి బూని
తీవెసవరించు శారదాదేవి యెవతె
భారతీ, రమా, ఉమా సమాహారమైన
మాతృత్రితయ స్వరూపిణి, భ్రాతృజాయ.

చీకటి జీవితమ్మునకు చిక్కనివెన్నెల పాలువోసి, చీ
కాకులచిక్కులన్ చివికి కారియవడ్డమనమ్ము మోదు మా
రాకులు హత్తగా అమృతహస్తము సాచి వసంతశాంతవే
శాకుట జాంత కుట్మలవిలాసము చూపెదవే వధూనికా!

వానకాలమందు కానలకోనల
చెట్లకొమ్మలందు చిన్నిగూట
రెక్కగొడుగు క్రింద డొక్కలప్రక్కల
పట్టిగాచు తల్లిపిట్ట వీవు

కైలాస శిఖరమ్ము కలదు నీ ఫాలాన
కాశికాపురమింక కావలయునె,
కల్పభూజమ్ములు కదలెనీ ఎదలోన
వాసంతలక్ష్మి కావలెనె నాకు,
పుష్కలా వర్తకాంబుదము నీకనులలో
వాసింప ప్రపలు కావలెనె నాకు
నీ పాదములు పద్మ నీకాశములు కాగ
లేమి కల్మలను చర్చించనేల

అన్నపూర్ణవై నీవింటనున్న యపుడు
తిండికై తిరిపెమ్మెత్తి తిరుగనేల
సింధువై నీవు వాకిట జీరువార
అంధువున స్నానమాడగా నరుగనేల

భ్రాతృజాయా కరస్పర్శనొందిన వల్లి
శిశిరమ్మునకు భీతి జెందబోదు,
వదిన పాదాంబుజ ద్వయిమెట్టిన గృహంబు
అంధకారము జూచి అడలబోదు

ఆమె కటాక్షవీక్షా మరందములాని
వేపకొమ్మల చేదు విరిగిపోవు
మా వధూనిక మృధుమధుర హాసమ్ములో
దుఃఖాలు పలుచనై తొలగిపోవు

ఉదయ కాలార్క బింబంబు మృదుకరాల
ఆమెపాదాల పారాణ నద్దిపోవు
సాంధ్యవేళా శశాంక కాషాయబింబ
మామె నఖముఖముల రాగ మద్దవచ్చు.

ఆమె జగత్కుటుంబిని, దయామయి ఆదిసవిత్రి, భూదివ
స్స్వామిని, దీనబాంధవి, విషాదభరాంతర శాంతి కృత్ చిరం
టీమణి, ఆమె పాదములనే స్మరియించెద జీవితాంతమున్,
నామది యామెకున్ గృహమనన్ రచియింతు ననేకపద్యముల్.

# అమృతాభిషేకము

ఎదగుడిలో సరస్వతి వసించి విపంచికమీటి పాడుచు
న్నది; నవచైత్రమాస గహన స్పృహణీయశలాకసూన సం
పదకు ఉగాదిమండపము మంజులమైనది నేడు; తెల్గు శా
రద కమృతాభిషేక మొనరన్ కవితాంజలిబూని రండహో!

కలతలులేని చక్కని ఒకానొక సౌధముకట్టి, దానిలో
పల కవితాసరస్వతికి వజ్రకిరీటము బెట్టి రేబవల్
కొలుతము రండు, ఘర్షణలకున్ కలహమ్ముల కాలవాలమౌ
ఇలకు ప్రశాంతి కల్పకమహీజము తెండు జనాళి మెచ్చగన్.

ద్వేషాగ్నియార పీయూషధారలు వార
పద్యాలకొన్నింటి పాడవలయు
కాఠిన్యములుడింద కరుణమ్ము పెంపొంద
పదములగొన్నింటి వాడవలయు
విసమెల్ల డుల్లగా రసముప్పతిల్లగా
వివిధభావముల కల్పించవలయు
అసహనమ్ముల ద్రుంచ నైకమత్యము పెంచ
నిర్మలస్నేహమ్ము నించవలయు

వేపపూవులలో చేదు విరిగిపోవ
రసనపై తీయమాటలు విసరవలయు
ఉదయమే లేని గాఢాంధహృదయమందు
చిత్రభాను సూనము వికసించవలయు

ప్రతికలమ్ములోన పద్యాలు వ్రాసెడి
దండిదనము నిండుచుండ వలయు
ప్రతి గళమ్ములోన పాటలు పాడెడి
ఇంపుదనము లావహింపవలయు

చుఱ్ఱుమనెడి యెండకఱ్ఱులు సాచిన
తేళ్ళనోళ్ళ నిన్ని నీళ్ళుపోసి
లతలతోడ చిన్ని రమణీయగేహమ్ము
కట్టి పవ్వళింప బెట్టవలయు

కడు నిరాశతోడ కళవళపడుచున్న
ఎదకు నవవసంత మీయవలయు
చిక్కిపోయనట్టి చెట్టుచెట్టున పూల
యౌవనమ్ము పొంగిపోవవలయు

ఈ యమృతాభిషేకమున కెందరు సత్కవులేగు దెంచి నా
రోయి మరంద మాధురుల సూను లసత్ కవితాప్రసూనముల్
దూయిటబూని? వారి ఎదలోన వసంతము లావహించి చాం
పేయ పరిమళమ్ములను వీచిన వష్టదిశాంతరమ్ములన్

చిరువేపకొమ్మపై చేరి తీయనిపాట
పాడుచున్నది చిల్కపడతి యొకతె
మండిపోయెడి యెండ మరచిపోవగ ప్రపా
శాలలో చిరునవ్వె చానయొకతె
ఒగరుమాని చిగుళ్ళు తెగమెక్కి గళమెత్తె
గాయని- కోకిల కాంతయొకతె
ఎట్టగా పాలాశమట్టు సాచినచోట
చల్లగా నిదురించె మల్లెయొకతె

శిశిర శుష్కానిలమ్ముల చివికియున్న
వనములో పూలుపూచెను వల్లియొకతె
ప్రాతబడి పోయినట్టి సంవత్సరమున
కాలుమోపెను క్రొత్తయుగాది యొకతె

ఆ ఉగాదికాంత అంగుళుల్ తాకిన
తీవె తీవె పూలు ప్రోవుబోయు
ఆమె పాదతలము లంటిన ఇరవెల్ల
నందనమ్ము వోలె అందగించు

ఆ యమకోసమై- బ్రతుకుటామని శైశిరరాక్షసి కర
చ్ఛాయల గ్రమ్మగిపోయినను సైచి దినాంత నిశాంత వేళలన్
కోయని కూసికూసి గళ గుంజనలన్ జగమున్ జయించి మా
కోయిల కుఱ్ఱవాడు కడకున్ దరిసించె నుగాది జవ్వనిన్

ఆమ్రశాఖాశోభి హైమాంశుకమునుండి
ముఖచంద్రబింబంబు మురిసిపోవ
చిరువేపకొమ్మపై సింగార మొలికించు
చేలాంచలమ్ములు జీరువార
శోకాపహాశోక సుందరాగమునుండి
కనకాంగదమ్ములు ఘల్లుమనగ
వివిధరాగాలాప విధిచొక్కు ప్రేంకణ
మ్మామెతో జతగూడి ఆలపింప

పూలతో పండ్లతో నవనాళికేర
జలముతో శుకపిక కలకలముతోడ
అరుగుదెంచె నుగాది సుందరి, మహాంధ్ర
కవిత కమృతాభిషేచనోత్సవము జరుప.

~~~
~~~

## -: ఈ కవిని గురించి :-

జననం : 1927

జన్మస్థానం ; గూడూరు, ఓరుగల్లుజిల్లా.

ఉస్మానియా విశ్వవిద్యాలయమునుండి, ఇంగ్లీషు సాహిత్యం ముఖ్యవిషయంగా బి. ఏ. పట్టం పొందారు. 1943 నుంచి 47 దాకా గార్ల జాగీరు ప్రాంతంలో, జాగీర్దారీవిధానానికి వ్యతిరేకంగా పోరాటం జరిపారు.

1947 లో హైదరాబాదుస్వాతంత్రోద్యమంలో పాల్గొని ఓరుగల్లు, నిజామాబాదు, హైదరాబాదు (చంచల్గూడా) జైళ్ళలో నిర్బంధింపబడ్డారు.

1952 లో తెలంగాణా రచయితలసంఘం స్థాపించి రెండుపర్యాయములు అధ్యక్షులుగా వున్నారు. ప్రస్తుతం హైదరాబాదు ఆకాశవాణిలో ప్రవచనశాఖాసహాయ ప్రయోక్తలుగా నుంటున్నారు.

రచనలు : అగ్నిధార, రుద్రవీణ, మహాంధ్రోదయం, మహాబోధి పునర్నవం, అమృతాభిషేకం.

## Check List

| | | | |
|---|---|---|---|
| Book Number | AAD01A105 | Date | 8-10-21 |
| Front Cover | yes | Back Cover | yes |
| Blank Pages | CI, 4, 8 | | |
| Missing Pages | No | | |
| Prepared | Sireesha | Scanned | Sireesha |
| BOOK SIZE | H 7.0 W 5.0 | Pages | 84 |

